# సువర్ణ కథావళి

# GOLDEN TALES



**CHRISTLIEB**



**CHRISTIAN LITERATURE SOCIETY FOR INDIA**

**MADRAS ALLAHABAD RANGOON COLOMBO**

**1927**

'ce 5 Annas] [1 E. 1 M.

# విషయసూచిక

అధ్యాయము | పుట

# GOLDEN TALES

# సువర్ణ కథావళి

## 1 వ. అధ్యాయము

### పొలములలో

చలికాలమైనందున ప్రొద్దు గ్రుంకి చలి ప్రారంభించునప్పటికి గ్రామస్థులు తలుపులు వేసికొని ఇండ్లలో వెచ్చగా నుండిరి. అయినను అందరు ఇండ్లలో నుండలేదుగాని కొందరు గొల్లవాండ్లు తమ గొర్రెలను కాచుకొనుచు రాత్రియంతయు పొలములో నుండవలసివచ్చెను. వారు బాగా కంబళ్లు కప్పుకొని చలిమంట వేసికొని, చలి కాచుకొనుచుండిరి. ఆ పొలములో చాలా గొర్రెల మందలుండెను గాన గొల్లవాండ్లు తమ భయమును తీర్చుకొనుటకును దయ్యములు రాకుండునట్లును అప్పుడప్పుడు ఒకరి నొకరు పలుకరించుచుండిరి.

వారిలో కొందరు నిద్రాభారమువల్ల జోగుచున్నప్పుడు మరికొందరు అకస్మాత్తుగా భయపడి బొబ్బలు పెట్టునప్పటికి అందరు లేచిరి.

అయ్యయ్యో! ఆ మంటలేమి? చేలలోని గూండ్లు ఏమైనా తగులు కొన్నవా? గూండ్లు కాదే? వెలుతురు ఆకాశములోనే కనబడుచున్నదే. ప్రొద్దు పొడుచుచున్నదా? ప్రొద్దు పొడుచుటకు చుక్కలుకూడ ఇంకను ఎక్కలేదే. ఇప్పుడు అర్ధరాత్రి మాత్రమే అని వారు కలవరపడుచుండిరి.

ఆ వెలుతురు అధికమగుచుండగా వారట్లే మ్రాన్పడి తేరిచూచుచుండిరి. వారిప్పుడు మరెక్కువ భీతిజెందిరి. తామదివరకు భయపడుచుండిన దయ్యములు ఇప్పుడు నిశ్చయముగా తమమీదికి వచ్చుచున్నవని వారు మరెక్కువ భయముతో వణకుచు నేలపడిరి. దయ్యములైతే వికారముగా నుండునుగాని తమ యొద్దకు వచ్చుచుండినవారు పరలోకమునుండి దిగి

వచ్చిన అందమైన దూతలవలె తళతళ మెరయుచు, తెల్లని వస్త్రములు ధరించుకొని, బహు దయగల ముఖములతో కనబడి, "భయపడకండి, భయపడకండ"ని తమతో చాలా నెమ్మదిగా పలుకుటను చూచి ఇంచుక ధైర్యము తెచ్చుకొనిరి.

ఆ దూతలు వారినిట్లు ధైర్యపరచినను వారింకను భయముతో వణకు చుండిరి. దూతలను ముఖాముఖిగా చూచినవారు బ్రదుకరు గనుక ఇక తమకు చావు తప్పదని వారు తలంచిరి. అయితే ఆ దూతలింకను వారితో మాట్లాడుచు, మీ రెందుకిట్లు భయపడుచున్నారు? ఇదిగో! మేము మహా సంతోషకరమైన సువర్తమానము మీకు తెచ్చియున్నామనిరి.

అందుకా గొల్లవాండ్లు, "ఏమీ! మహా సంతోషమా? ఎవరికి? రాజులకా, సాహుకారులకా, బాగా చదివిన భక్తశ్రేష్ఠులకా? రాత్రిం బగళ్లు అడవులు తిరిగి కష్టపడుచుండే మేమెక్కడ? సంతోషమెక్కడ?" అని పలికిరి.

అప్పుడా దూతలు, ఇది సమస్త మానవులకు కలుగవలసిన మహాసంతోషమే. ఏలయనగా, దావీదు పురములో నేడు మీకు ప్రభువైన క్రీస్తు అను రక్షకుడు పుట్టియున్నాడనిరి.

అంతట వారు సంగతి గ్రహించిరి. తమ దేశమును పూర్వముండిన వైభవమునకు మరల తెచ్చునటువంటి ఒక రాజు పుట్టునని వారి పెద్దలు వారికి చెప్పుచుండిరి. ఆయన ఇప్పుడు పుట్టెను. అయితే, పాపము! వీరు గొల్లవారుగదా. అట్లుండగా రాజ నగరులోనుండు ఆయనను ఎట్లు చూడ గలరు? చూడలేరుగదా. ఇది సత్యమైనది అబద్ధమైనది వారు ఎట్లా కను గొందురు?

ఆ దూతలు గొల్లవారిని చూచి, ఇదే మీకు ఆనవాలు. ఆ చిన్న వాడు ఒక పశువుల తొట్టిలో పండుకొనియుండుటను మీరు చూతురని చెప్పిరి. ఇంతలో వారు చూచిన వెలుతురు క్రమ క్రమముగా ఎక్కువగు చుండెను. ఆకాశమంతటను పరమదూతలుండినట్లు కనబడెను. వారందరు కలిసి దేవునికి స్తుతిగీతములు పాడుచుండగా ఆ గొల్లవారు వినిరి. దూతలు ఈలాగు పాడుచు సాగిపోవుకొలది వారి పాటలుకూడ రాను రాను విన బడకుండపోయెను. వెలుతురుకూడ తగ్గుచువచ్చెను. మరికొంచెము సేపటికి ఆకాశమున మిణుకు మిణుకు మనుచుండిన చుక్కలు తప్ప మరేమియు కన

బడలేదు. జరిగినదంతయును ఆ గొల్లవాండ్లు చూచి ఆశ్చర్యపడి, ఒకరి ముఖము నొకరు చూచుకొని,

"ఇది కలయా నిజమా? ఏదైనది వెళ్లి కనుగొందము పదండి. రాజేమి! పశువుల తొట్టిలో పండుకొని యుండుటేమి? మన యూరి సత్రములో నాలామంది బాటసారులు దిగియున్నారు గదా. ఇది అక్కడనే జరిగి యుండవలెను" అని చెప్పుకొని, ఆ తక్షణమే వెళ్లి, దూత చెప్పినట్లు తల్లి పొత్తిగుడ్డలతో చుట్టివేసి పశువుల తొట్టిలో పరుండబెట్టిన ఆ శిశువును చూచి ఆయనకు మ్రొక్కిరి

ధ్యానము.

లూకా 2: 8–17 చదువుము.

లోకరక్షకుడీలాగు దిక్కులేని ఒక బిడ్డ యవతారమెత్తి ఈ లోకమునకు వచ్చుటకు కారణమేమి? ఆయనకు ఎవరి ఇంటిలోగాని గౌరవముఖ్యముగా ఒక సత్రములోకూడ స్థలము దొరకకుండుటకు కారణమేమి?

ఏమనగా, ఆయన నివసింపగోరిన స్థలము ఒక యిల్లుగాని, ఊరుగాని, దేశముగాని, మనకు తెలిసిన ఏ భాగముగాని, ఒక ఆలయముగాని కాదు. ఆయన నివసింపగోరిన యిల్లు మానవ హృదయమే.

మానవు లందరి హృదయములు తమ స్వసుఖముకొరకైన కోరికలతోనే నిండియున్నవి. మనము మన స్వసుఖమును లాభమును కోరుటవల్ల ఇతరులకు నొప్పి కలిగించుచున్నాము. అట్టి స్వార్థతకు కోపము, మోసము, సోమరితనము, చెడుతనము ఇవన్నియు ఫలితములే

ఈలాటి మన చెడిన హృదయములలోనే శ్రీ యేసునాథుడు జన్మింప గోరుచున్నాడు. అలనాడు రోతగానుండి చుట్టు జనులు మూకగా చేరి యుండిన ఆ సత్రములో జన్మించిన ఆయనే నీ హృదయములో జన్మింప గోరుచున్నాడు. అప్పటికి శిశువుగా పుట్టి పశువుల తొట్టిలో పరుండిన ఆయన అప్పటినుండి లోకమును మరెక్కువగా పవిత్రపరచుచు క్షేమము కలుగజేయుచున్నాడు. నీవుకూడ ఆ పవిత్ర బ్రతుకు బ్రతుకవలెనని కోరి ఆయన నీ హృదయములో ప్రవేశింప నిశ్చయించుచున్నాడు గనుక ఆయనను చేర్చుకొనుము. ప్రభువైన క్రీస్తూ! నా హృదయములోకి రమ్ము. నీవు నివసించుటకు నా హృదయములో చోటున్నదని ఆయనతో నిష్టపూర్వకముగా చెప్పి ఆయనకు స్వాగతమియ్యవా?

అట్లు చేసినయెడల క్రీస్తును బోలిన క్రొత్త బ్రతుకు నీలో మొలిచును. ప్రతిదినము ఆయన నీ హృదయములోకి వచ్చునట్లు అడుగుకొనుము. నీలో తన బ్రతుకును నెలకొల్పుమని ఆయనను ప్రతిదినము వేడుకొనుము. అట్లు చేసితివా, నీ బ్రతుకు క్రొత్తదగును. దురాశలు పోయి నీ మనస్సు క్రీస్తు మనస్సుగా మారును. క్రీస్తు స్వరూపము మీయందేర్పడు పర్యంతమును (గలతి 4: 19) క్రీస్తుకు కలిగిన సంపూర్ణమైన పురుషత్వమునకు సమానమైన పురుషత్వముగలవారమగుపరకు (ఎఫెసీ 4: 13) నీలోని ఆయన బ్రతుకు అంతకంతకెక్కువగా బలపడును.

# 2 వ. అధ్యాయము

## ఒక పెండ్లి సమయమున

మన యూరిలో నెవరి యింటి ముందరనైన పందిరివేసి, తోరణములు కట్టి, ముగ్గులు పెట్టియుంటె అక్కడ ఎవరిదో పెండ్లి జరుగుచున్నదని మనము తెలిసికొందుముగదా. అలాగే కానా అనే ఒక చిన్న పల్లెలో ఒకనాడొక యింటిముందర పందిరి వేసినందున అక్కడ పెండ్లి జరుగుచుండెనని అందరు తెలిసికొనిరి. పెండ్లి కుమారుడును, పెండ్లి కొమార్తెయు, పెండ్లికి పిలువబడినవారందరును ఊరేగింపు చేసి ఇంటికి వచ్చిరి. మేళగాండ్లు కొంచెముసేపు అలసట తీర్చుకొనుటకు కూర్చుండిరి. వంటలన్నియు సిద్ధముగా నుండెను. పెండ్లికి వచ్చినవారందరు చాలా ఆకలిగొనియుండినందున భోజనము చేయుటకు తీవ్రపడుచుండిరి. యేసుక్రీస్తు తల్లియైన మరియమ్మ ఆ పెండ్లి కుమారుని బంధువురాలు గనుక పనిపాటులలో వారికి సహాయము చేయుటకు వచ్చియుండెను. ఆ నాటి ఉదయమున పెండ్లికి పిలువబడిన యేసుక్రీస్తును అప్పటికి ఆయన వెంటనుండిన అయిదారుగురు శిష్యులును ఆ యూరికి వచ్చియుండిరి. పెండ్లికుమారుని యింటివారు ఆయనను ఆయన శిష్యులను పెండ్లి విందుకు పిలచిరి. పెండ్లి సమయములలో సాధారణముగా చాలా అన్నము వండి రాసులు పోసియుందురు గనుక ఆకస్మికముగా ఎవరైన వచ్చినను వారికి కావలసినంత అన్నము దొరుకును.

పెండ్లికి వచ్చిన ప్రతివారు చాలా ఉల్లాసముగా నుండిరి. వారందరు సంతృప్తిగా భుజించుచు సరససల్లాపములు చేయుచుండిరి. భోజనముతో కూడ ద్రాక్షారసము త్రాగుట ఆ దేశ వాడుక. ఆ మీదట భక్ష్యములును పండ్లు ఫలహారములును సేవించిరి. ఆ సరస్సు చుట్టు ప్రక్కలనుండు గుట్టల మీద పండిన ద్రాక్షపండ్ల రసమును వారు త్రాగిరి. ఆ మీదట వారు కాయపప్పు మిఠాయి తినుచుండగా వారిలో ఒకరిద్దరు దప్పిగొని, పని వారిని పిలిచి, కొంచెము ద్రాక్షారసము తెండని చెప్పిరి.

ద్రాక్షారసము తేబోయిన పనివారు వెంటనే రాక ఏదో ఒక కారణమువల్ల ఆలస్యముచేసిరి. అంతలో నొక పనివాడు ఆ విందు ప్రధాని యొద్దకు వెళ్లి ఏమేమో గుసగుస మాట్లాడుచుండగా ప్రధాని తొందర పడుచు తిరిగి వానితో ఏమో చెప్పుచుండెను. వాడు కొంచెము ద్రాక్షారసము తీసికొనివచ్చి చెయ్యిచాపిన వారందరి గిన్నెలలో కొంచెము కొంచెము పోయుచుండెను. ఇంకా కొందరు గిన్నెలు చాపగా ఆ పనివాడు, కొంచెముసేపు తాళుడి, త్వరలో తెచ్చెదనని చెప్పి వెళ్లి మరల రాలేదు. ద్రాక్షారసముకొరకు కనిపెట్టుకొనియుండినవారందరి సంతోషము ఇప్పుడు కొంచెము సద్దణగెను. వారు విందు ప్రధానివైపు చూచి అతని ముఖము చిన్నబోయినట్లు తెలిసికొనిరి. అప్పుడు నిమ్మళమైన నీళ్లలో రాయిపడ వేసినట్లాయెను. కొందరు విచారముఖులై ఒకరితో నొకరు మాట్లాడుచు, ద్రాక్షారసము అయిపోయినదేమో అని తమలో తాము అనుకొనుచుండిరి. అక్కడక్కడ కొందరు హేళనభావముగా నవ్వుచు, పెండ్లి సమయమున ద్రాక్షారసము లేకపోవడము ఎంత సిగ్గుకరమైన సంగతి! అని చెప్పుకొను చుండిరి.

ఇట్లుండగా యేసుక్రీస్తు ఆ పనివారిని పిలిచి వారితో ఏమో ఆలోచించుచుండెను. ఆ సంగతి వీరెవరును ఎరుగరు.

పిమ్మట పనివారు పాత్రలనిండ ద్రాక్షారసము తీసికొని త్వర త్వరగా జనులయొద్దకు వెళ్లి చెయ్యి చాపిన ప్రతివారి గిన్నెలనిండుగా పోసిరి. త్వరలోనే వారందరు మునుపటివలె సంభ్రమపడుచు, బాగా త్రాగి, తమ ముచ్చటలు సాగించిరి. పెండ్లింటివారుకూడ తమ భయమును విచారమును మాని ఇతరులతోపాటు సంభ్రమపడుచుండిరి. ముందు ద్రాక్షారసము లేదని చూచి హేళనగా మాట్లాడినవారందరు ఇప్పుడు అది అధికముగా నుండుటను చూచి సిగ్గుపడిరి. ద్రాక్షారసము లేనప్పుడు వారిలో కలిగిన

కలత ఇప్పుడు అణిగిపోయినది. ఈ యసందర్భమువల్ల ఒక క్షణముమాత్రము వారి సంతోషము భంగమైయుండినను ఇప్పుడది ఎన్నో రెట్లు అధిక మాయెను. భగవంతుడు తమ కాసన్నుడై తమ్ము నాశీర్వదించుచున్నాడని వారందరు ఆనందించిరి.

పనివారిలో కొందరు కొంచెము ఎడముగా నిలుచుండి, గుసగుస మాటలాడుచు, ఆయనను గంభీరముగా చూచుచు, ఆయన చేసిన ఘన కార్యమునుబట్టి మిగుల ఆశ్చర్యపడునట్లు కనబడిరి గాని తక్కినవారెవరును ఆయనను అంతగా గమనించలేదు. విందు ముగిసిన తర్వాత ఆ పనివారు కొంచెముసేపు యేసు శిష్యులతో సంభాషించుచుండగా ఒక శిష్యుడు, అది దేవుని ప్రభావమువల్ల జరిగెనని తక్షణమే గ్రహించెను. తరువాత ఆ శిష్యుడు ఆయన చరిత్రను వ్రాయుచు, "యేసు ఈ మొదటి సూచక క్రియను చేసి తన మహిమను బయలుపరచెన"ని ఒక చోట లిఖించెను.

ధ్యానము.

యోహాను 2: 1-11 చదువుము.

నీళ్లను ద్రాక్షారసముగా చేసిన యద్భుతమా ఆయన మహిమను బయలుపరచినది? ఇది నాచేత కాదే. అట్లుండగా ఈ కార్యమువల్ల నాకేమియు ప్రయోజనము లేదా?

ఎప్పుడో ఒకనాడు మనముకూడ ఈలాగు తల్లడిల్లి సిగ్గుపడుటకద్దు. ఎందుకనగా మనము బీదవారమైనందున ఆడంబరముగా జరిగించలేము. అట్టి సమయములో వారిని కలతపరచినది అల్పస్వల్ప విషయమని నేను కనుగొని, వారిని గేలిచేసి పంపేదానను. దేని విషయమైనను నేను నిష్కారణముగా సంకటపడక దానిని నవ్వులాటగా ఎంచునట్లు ఆ విందులో తటస్థించిన సంకటమును ఆయన మాపుచేసెను. యేసుక్రీస్తు ఎల్లప్పుడు ఇతరుల సంకటములను తొలగించి, వారిని సంతోషపెట్టెను. దైవలక్షణ మాలాటిదేగదా. ఆయన వారి కార్యమును చక్కపెట్టినప్పుడు, "నేను ఈ కార్యము చేసినాను. నేనెంత గొప్పవాడనో, మీకెంత మేలు చేసినానో, మీకొరకు నేనెంత శ్రమ పుచ్చుకొంటినో చూడుడి" అని ఆయన చెప్పలేదు. ఆయన యందు వెలిసిన కళ్యాణగుణ లక్షణమేమనగా, ఆత్మస్తుతి కోరక అందరికి ఉపకారము చేయుటయే.

ప్రార్థన.

ప్రభువైన యేసూ! నేనిప్పుడు ధ్యానించిన విషయములో నిన్ను బోలి నడుచుకొనునట్లు నాకు సహాయము చేయుము. నేను నిన్నుగురించి తెలిసికొని, ఎవరైన కాయిలా కష్టములలో నుండగా చూచినయెడల వారికి సహాయము చేయునట్లును, అట్లు చేసిన పిమ్మట అందునుగురించి ఎవరితోను చెప్పకుండునట్లును, కృప దయచేయుము. ఎవరైనను సిగ్గుపడియుండినగాని తొందరలో చిక్కుకొనియుండినగాని అది నాకు తెలిసినట్లు నేనెవరికిని కనుపరచక అతనిని సముదాయించుటకు నా శక్తికొలది ప్రయత్నింతును. ప్రతిదినము నేనితరులను సంతోషపరచుటకు తగిన సాధనమును కనుగొను నట్లు నాకు సహాయము చేయుము. ఆమేన్.

# 3 వ. అధ్యాయము

## వడ్లవాని యింటిలో

కోడెలవాండ్లు తమ యెద్దులను అమ్ముటకు వచ్చినప్పుడు ఒక రైతు కాడియెద్దులను కొనెను. వాటికి కాడిమాను అవసరమగుటవల్ల అతడు ఆ యూరి వడ్లవాని యింటికివెళ్లి, ఒక క్రొత్త కాడిమాను చేయుమని చెప్పెను. దానిని తయారు చేసినప్పుడు ఆ వడ్లవాడు ఎద్దులను తన యొద్దకు తీసికొని రమ్మని ఆ రైతుతో చెప్పెను. రైతు ఎద్దులను తేగా ఆ వడ్లవాడు వాటి మీద కాడిని ఉంచి సరిచూచిన పిమ్మట అది వాటికి సరిపోవునట్లు దానిని ఇక్కడ కొంత అక్కడ కొంత చెక్కివేసెను. అది చూచి ఆ రైతు, "ఏమయ్యా! నీ వెందుకింత కష్టపడుతావు? వడ్లవాండ్లందరు ఇంత నాజూకుగా చేస్తారనుకొంటివా? ఒకరికిచ్చినట్లే నీకుకూడ కూలి ఇయ్యకుందుమా యేమి? అయినను నీవింత సొగసుగా దీనిని చేసి పుణ్యము కట్టుకొన్నావు" అని ఆ వడ్లవానితో చెప్పెను.

అందుకు వడ్లవాడు, ఈ పశువులు మనకొరకు ఎంతో ప్రయాసపడుచున్నవి గనుక వాటికి నొప్పి కలుగకుండ చూచుట మన ధర్మము. అవి కూడ దేవుని సృష్టియేగదా? అని పలికెను.

ఆ రైతు తన యింటికి వెళ్లుచు, "ఈ వడ్లవాడు ఎంత వింతగా మాట్లాడుతాడు? అయినను అతడట్లు మాట్లాడడమేకాకుండ బహు శ్రేష్ఠమైన పనికూడ చేస్తాడు. నే నికమీదట నా కొరముట్లెల్లను అతనివద్దనే చేయించుకొంటాను" అని తలంచెను.

కొన్ని మాసములైన పిమ్మట అతని బండీ చక్రములో నొక ఆకు విరిగి పోగా దానిని బాగుచేయించుటకై ఆ రైతు అదే వడ్లవానిదగ్గరకు వెళ్లెను. అప్పటికి ఆ వడ్లవాడు ఇంటిలో లేకుండెనుగాని అతని అన్నదమ్ములు మాత్రముండిరి. ఆ వడ్లవాడెక్కడ? అని రైతు వారి నడుగగా వారు, అదేమో మాకు తెలియదు. ఆయన ఒక నెలదినములక్రిందటనే వెళ్లి పోయెను. ఒకవేళ అడవిలో నున్నాడేమో? అనిరి.

కొన్నాళ్లైన తరువాత ఆ వడ్లవాని సమాచారము తెలియవచ్చు చుండెను దూర గ్రామములనుండి వచ్చినవారు తాము ఆయనను కన్నులార చూచి ఆయన బోధను చెవులార విన్నట్లు చెప్పుచువచ్చిరి. ఆయన నీతి బోధ చేయుచుండెననియు, ఇతర మత గురువులవలెగాక బహు విచిత్రముగా బోధించుచుండెననియు, ఆయన ఇంతలోనే ఒక గొప్ప వైద్యుడై మందు మాకు లేకనే మాటమాత్రమున ఒక గుడ్డి భిక్షుకునికి చూపుదయచేసెననియు, కుష్ఠరోగులను ముట్టగానే వారు బాగైనారనియు, చెప్పుకొనుచుండిరి.

అయితే ఆ యూరివారు, మేము ఆ మాటలు నమ్మము. ఆయన వడ్ల పనితప్ప మరేపనియు ఇక్కడ చేసియుండలేదు. ఆయన అలాటి కార్యములు మా మధ్య చేసియుండినయెడల మాకు తెలియకపోవునా? అనిరి.

వడ్లవాడైన యేసు ఒకనాడు తన ఊరికి తిరిగి వచ్చెను. వారములోని ఏడవ దినమున అనగా ఎల్లప్పుడును పరిశుద్ధముగా నాచరింపవలసిన దినమున ఆయన తన వాడుక ప్రకారము దేవాలయమునకు వెళ్లెను. ఆయన వేద గ్రంథములోని కొన్ని వాక్యములు చదివి, జనులతో మాట్లాడ నారంభించెను. ఆ రైతును అతనితోటి ఇతర రైతులును, వడ్లవాండ్లు, కమ్మరవాండ్లు, కుమ్మరవాండ్లు, బెస్తవాండ్లు, మొదలగువారందరును ఆయన కరుణాపూరితమైన మాటలకు కడు ఆశ్చర్యము నొందిరి.

"ఇదేమి? చాలా క్రొత్త బోధగానున్నదే? ఇతడు ఆ వడ్లవాడు కాడా? ఇతనికి ఈ జ్ఞానమెక్కడనుండి వచ్చినది? ఇతడు అధికారముతో బోధించుచున్నాడే?" అని వారు చెప్పుకొనిరి.

అయితే యాజకులును మత బోధకులును చాలా మండిపడి, ఇతడు మన వడ్లవాడే గదా. ఇతని బంధువులందరిని మన మెరుగుదుము గదా. ఇతడేనా మనకు బోధంచేవాడు? అని చెప్పి ఆయనను ఆ దేవాలయము నుండి వెలుపలికి త్రోసివేసిరి. యేసుక్రీస్తు తన స్వంత యూరిలో కొన్ని మంచి కార్యములు చేయనైయుండెనుగాని వారాయనను నమ్మలేదు గనుక ఆయన అట్లు చేయలేకపోయెను. అందువల్ల ఆయన మిగుల వ్యసన పడెను.

ధ్యానము.

లూకా 4: 14-22 } చదువుము.
మత్తయి 13: 54-58 }

దేవుడు లేడని మన మనుకొనే అనేక చోట్లలోనే ఆయన ఉన్నాడు. ఆయన సర్వ సాధారణమైన వస్తువులద్వారా అనగా పూలు, గాలి, ఎండ, వాన, సామాన్య జనులు మొదలగువానిద్వారా తన్నుతాను బయలుపరచుకొనును. మనకొరకు ఎంతో ఓపికతో పనిచేయుచున్న పశువులు దేవుని ఆలోచనవల్ల కలిగినవే. తమ పేదరికముచేత కష్టముచేసి బ్రతుకవలసిన మిక్కిలి సర్వ సాధారణమైన జనులు సహితము తమకు తెలియకపోయినప్పటికిని దేవునితో కలిసి మెలిసి ఆయనను హత్తుకొని జీవించుచున్నారు.

నేను నేడు చూచు ప్రతిదానిని అనగా సమస్త వస్తువులను సమస్త మనుష్యులను భయభక్తులతో చూడవలెను. ఎందుకనగా దేవుడు అక్కడ వాటి వెనుకనే యున్నాడు.

ప్రార్థన.

మా పరమ తండ్రివైన దేవా! నీ బోధకు చెవియొగ్గునట్లు వినయము గల మనస్సు నేడు మాకు దయచేయుము. సాధారణ వస్తువులద్వారాను, జనులద్వారాను నీ పరిశుద్ధ వాక్యమును వినగలుగునట్లు మాకు సహాయము చేయుము. మా భూములద్వారాను, మా పిల్లలద్వారాను, మా ఇరుగు పొరుగువారిద్వారాను మేము నీయొద్దనుండి వచ్చు వర్తమానము వినునట్లు కృప దయచేయుము. ఆమేన్.

# 4 వ. అధ్యాయము

## సముద్రతీరమున

బెస్తవాండ్లు సముద్రపుటొడ్డున వలలు ఆరవేసికొనుచుండిరి. తక్కిన వారు పనిముట్లు చక్కపెట్టుకొనుచుండిరి. ఆ ప్రాతఃకాల సూర్యకిరణములకు సముద్రము మిణుకుమిణుకుమని ప్రకాశించుచుండెను. పెద్ద తొలుకులు ఆడుచున్నప్పుడు ఎండకు నీళ్లపైన అలలు చీల్చుకొని చిన్నచిన్న తొలుకులుగా మారుచోట్ల లక్షలకొలది వజ్రములు చల్లిరేమో అన్నట్లు నీళ్లు తళతళ మెరయుచుండెను. చిన్న పిల్లలు లోతులేని నీళ్లలో సహితము కష్టముతో నడుచుచు, ఎండ్రకాయలను, చిన్నచిన్న చేపలను పట్టుకొనుచు, ఉల్లాసము పట్టలేక కేకలువేయుచుండిరి. అయితే కొందరు పురుషులు ఈ ప్రకృతి వింతను సరకుచేయక ఒకరితో నొకరు వాదులాడుచుండిరి. వారిలో నొకడు ఆ దినమే క్రొత్తగా చేపలుపట్టవచ్చిన ఒకని చూచి మండిపడి, ఒరే! నీ పడవలేరా రాత్రి నా పడవలను పాడుచేసినది. నీవే వాటిని బాగుచేయవలెననెను.

రెండవవాడు–నా పడవలు కానేకాదు. అది నీ తప్పితమే. నీవు నా పడవల నానుకొనియే వలవేస్తివి. వలవేయకముందే నీ పది చూచుకోవలసియుండెను.

మొదటివాడు–నేను ప్రతిదినము వలవేసేచోట నీ పడవలకేమి పని? అట్లు నాకు అడ్డమురావడమే తప్పని నీకు తెలియదంటరా దుష్టుడా? ఈసారి రా, నీ పెండ్లిచేస్తాను.

రెండవవాడు–(కొంచెము రౌద్రము తెచ్చుకొని) ఈ సముద్రమును మీ యబ్బయేమైనా సంపాదించినాడా? నా యిష్టమువచ్చినచోటికి నేను పోతాను. ఇక నోరు మూసికోరం వదురుపోతా. నీవేమి నాకు చెప్పేది?

మొదటివాడు–(ఇంకా వదరుచు) ఒరే! నీ విట్లా తిట్టుతూయుంటే నేను ఇక ఊరుకోలేను. ఏమి నేను పాలు త్రాగుచున్నాననుకొంటివా? మాయబ్బతోడు నీ మాటలే నిన్ను కొట్టుతాయి రేరా.

ఇంతలో మరియొకడు వారిని మందలించుచు, ఒరే, ఊరుకోనండి. అక్కడ చూడండి, నజరేతు వడ్లవాడు వచ్చుచున్నాడు. పోయినవారము మనతో మాట్లాడినట్లు ఒకవేళ ఇప్పుడుకూడ కొంచెముసేపు మనదగ్గర నిలిచి మాట్లాడునేమో చూస్తాము. ఒరే సీమోనూ! మీరిట్లు కొట్లాడడము చూస్తే ఆయన మనతో మాట్లాడకుండ వెళ్లిపోతాడు. మనమాయన నిక్కడ పిలిచి మన వలలు బాగుచేసికొంటూ ఆయన సత్యవాక్కులు విందాము. ఆయనవలె ఇదివరకెవరును మాట్లాడియుండలేదనెను.

సీమోను తాను కోపపడినందుకు చాలా సిగ్గుపడుచు, తమవైపు వచ్చుచుండిన యేసును తేరిచూచుచుండెను. సీమోను బందుకూతలు యేసు వినియుండెనా? ఆయన తాను విన్నట్లు వారికి కనుపరచక వారి దగ్గర కూర్చుండి బోధించెను. వారు కొట్లాడుటను ఆయన చూచియుండెను. అయినప్పటికిని కొన్నాళ్ళయిన తరువాత ఆయన అదే సీమోనును తనవెంట రమ్మని పిలచెను.

యేసు ఈలాటి జనులలోనుండియే తన శిష్యుల నేర్పరచుకొనెను. వారిలో నొకరైనను విద్యావంతులుగాని గొప్ప భూస్వాములుగాని కారు. కొందరు మాత్రము వ్రాయ నేర్చుకొనియుండిరి. అదిమాత్రముకాక వారంత భక్తిపరులుగూడ కారు. వారు యేసుచేసిన బోధను సరిగా గ్రహించుకొనక పోవుట మాత్రముగాక మొదట దాని నంతగా అంగీకరించలేదు. నజరేతు నుండి మంచిదేదైన రాగలదా అని నతనయేలు చెప్పుటను చూడగా ఒక క్రొత్త మతములో ఏ మేలును లేదని అతడు గ్రహించినట్లు తెలియుచున్నది. ఆకలిగొనియుండిన వేలకొలది జనులకు అన్నము పెట్టవలసివచ్చినప్పుడు ఫిలిప్పు తన దగ్గర నెంత పైకమున్నదో చూచుకొని, ఇదేమి చాలుతుంది? అనెను. అంద్రెయ తమ దగ్గరనుండిన కొద్ది భోజనపదార్థములు చూచి, ఇంతమందికి ఇదెక్కడ చాలునని చెప్పెను. వారిలో నెవరును దేవుని గురించి తలంచలేదు. వారొక పడవలో ప్రయాణము చేయుచుండినపుడు గొప్ప తుపాను రేగి పడవలోకి నీళ్లు కొట్టగా వారు మిక్కిలి భయపడి వణుకుచు బిగ్గరగా కేకలువేసిరి. చుట్టుప్రక్కల శత్రువులు కమ్ముకొని తమకు ఉపద్రవము కలుగునట్లుండగా తోమా భయపడి, మనము వెళ్లి ఆయనతోకూడ చస్తాము రండని చెప్పెను. కొందరు దుర్భాషలాడుచు తిరిగి తమ పాత త్రోవనే అనుసరించిరి. వారిలో చాలమంది కలహప్రియులుండిరి. వారందరు తమ స్థితినిబట్టి బహుగా గర్వించుకొనుచు, తాము

ఇతరులకంటె గొప్పవారైనట్లు జనులు తలంచవలెనని కోరిరి. వాస్తవముగా వారందరు మనవలెనే యుండిరి. ఇటువంటివారే కడకు భూలోకమంతటిని తలక్రిందులు చేసి, క్రీస్తుమతమును స్థాపించి, అది ప్రస్తుతమున ఇండియా దేశమునకును, కడకు నీ గ్రామమునకును వచ్చునట్లు చేసియున్నారు.

వారెట్లు ఈ స్థితికివచ్చిరి? యేసుక్రీస్తును నమ్ముకొని ఆయన పరిశుద్ధాత్మను పొందుటవల్లనేగదా.

యేసుక్రీస్తు మన యిండియా దేశములోని గ్రామములయందు సంచరించుచుండినయెడల ఆయన ఎవరిని పిలుచును? ధనికులనా లేక జ్ఞానవంతులనా? వీరిద్దరిని కాదుగాని సాధారణ జనులనే పిలుచును. ఆయన మల్లేనును, వెంకటప్పను, ఓబిగాన్ని, వీరన్నను పిలుచును. ఆయన ఇప్పుడు పండితులను కాదుగాని పామరులను, దైవజ్ఞానముగలవారిని కాదుగాని మూఢులను, పిలుచుచున్నాడు. జనులిప్పటికిని దుర్వ్యాడుకల ననుసరించువారును, స్వార్థపరులును, బుద్ధిహీనులును, పిరికివారును అయియున్నప్పటికిని ఆయన వారినే తన శిష్యులు కండని అడుగుచున్నాడు. ఆయన గలిలైయలోని చదువుసాములేని బెస్తవారిని, అందరిచేతను హీనముగా నెంచబడిన సుంకపు గుత్తదారులను ఏలాగు శిష్యులనుగా చేసెనో ఆలాగే తెనుగుదేశ గ్రామములలోని హీనకులస్థులను దౌర్భాగ్యులను ఆ పనికి నియమించుటకు ఆయన సిద్ధముగా నున్నాడు

## ప్రార్థన.

ఓ ప్రభువైన యేసూ! నేనుకూడ నిన్నుగురించి తెలిసికొని వెంబడింపగోరుచున్నాను. నేనింకను భయస్థుడనై యున్నప్పటికిని నీవు నాకభయమిచ్చి సహాయము చేయగలవు. నేను చాలా చెడ్డ అలవాటులుగలవాడనై పలుమారు చెడ్డమాటలాడి అబద్ధములు చెప్పినను నేను నీ శిష్యుడను కావలెనని నీవు నన్ను పిలుచుచున్నావు. నేను విశ్వాసములోను మంచితనములోను లోపముగలవాడనైయున్నను నీవు నన్ను బలపరచగలవు. నేటిదినమును ప్రతినిత్యమును నేను నీ యడుగుజాడలయందు నడచి నీ భక్తుడనగునట్లు నాకు సహాయమునిమ్ము. ఆమేన్.

# 5 వ. అధ్యాయము

## బావిదగ్గర

అయిదారుగురు స్త్రీలు బావిదగ్గర నిలుచుండి తమ తమ వంతుల ప్రకారము నీళ్లు చేదుకొనుటకు కాచుకొనుచుండిరి. ఆ బావి ఊరికి చాలా దూరముగానుండి మిగుల లోతైనదైనప్పటికిని అందులో స్వచ్ఛమైన నీళ్లు దండిగా నుండును గనుక చాలామంది ఆ బావికే వెళ్లి నీళ్లు చేదుకొనుచుండిరి. వారట్లు తమ వంతులకొరకు కాచుకొనుచుండగా సాధారణముగా తమ యూరిలోని సంగతులనుగురించి ముచ్చటించువారు. ఒకనాడు వారొక విశేష సంగతినిగురించి ఏమేమో మాట్లాడుకొనుచుండిరి.

వారిలో నొకతె యుండుకొని, మొన్న చనిపోయిన ముత్యాలుగాని భార్యసంగతి నీకు తెలియునా? అని అడిగెను.

అది రెడ్డిగారితో మూడేండ్లు సంసారము చేసెనట నిజమేనా? అని మరియొకతె అడిగెను.

అవునే. అది అంతకుముందు కొత్తూరులోని కంసాలివాన్ని పెట్టుకొనియుండెనట అని ఇంకొకతె పకపక నవ్వుచు చెప్పెను.

అది తిరిగి వచ్చి మన వీధిలోనే కాపురమున్నది. నేను నిన్నటి దినమే దాన్ని చూస్తిని. జంగీ యంగడి వెంకటయ్య ఇంటి వెనుకనున్న ఖాళీ యిల్లు బాడుగకు తీసికొన్నది.

ఓహో, ఆ యిల్లా! నిన్న వెంకటయ్య ఆ యింటిలోకి పోతూ ఉండినందున అది యింకను ఖాళీగానే యున్నదనుకొంటిని.

ఇట్లు సంభాషించుచు ఆ స్త్రీలందరు ఒకరితట్టొకరు చూచుకొని, అట్లయితే ఆ పుకారా అంతయు సత్యమే అని చెప్పుకొనిరి.

ఇంతలో ఒకతె వారందరిని మందలించుచు, ఇక ఊరుకొనండే. అది నీళ్లకు వచ్చుచున్నది. దానితో నాకేమి మాటలు. నేను పోతానమ్మా అనెను.

వారిట్లు మాట్లాడుకొనుచుండగా ఒక స్త్రీ చేలలోబడి తలవంచుకొని ఒంటరిగా బావికి వచ్చుచుండెను. ఆమె బావిదగ్గరకు వచ్చినతోడనే తన కడవను క్రిందపెట్టి ఆ స్త్రీలవైపు అట్లే చూచుచుండెను. వారందరు

ఆమె దూరములో నుండినప్పుడు బహు కుశాలుగా మాట్లాచుండి ఇప్పుడు దగ్గరకు రాగానే ఊరకుండిరి. వారు తనతో మాట్లాడుదురో లేదో అని ఆమె అనుకొనుచుండెను. అయితే ఆమెను చూచినతోడనే వారందరు అయిష్టముతో తమ ముఖములు త్రిప్పుకొనిరి. అదివరకు మాటలలో మునిగియుండినవారు ఇప్పుడు మౌనులై తమ కడవల నెత్తుకొనిపోయిరి. చేల లోని కాలిదోవలోకి రాగానే వారు తిరిగి ఏమేమో మాట్లాడుకొను చుండిరి.

కడకు ముత్యాలు సౌభాగ్యమాత్రము బావిదగ్గర ఒంటరిగా విడువ బడెను. ఆమె దీర్ఘముగా నిట్టూర్పువిడిచి, వీరెంత కఠినులమ్మా! నేనెట్లు ఇది భరించగలను? ఇక మీదట నేను ప్రొద్దునపూట నీళ్లకు రానే రాను. మధ్యాహ్నమప్పుడు ఎఱ్ఱని యెండలో నెవరును రారు గనుక అప్పుడు నేను నీళ్లకు వస్తానని యనుకొనుచు, ఏమమ్మా, ఈ యాడువారికింత కఠినము! ముండ బ్రతుకెంత కష్టమో వారికేమి తెలుసును? ఇట్లున్నప్పుడు నారు నాకు ఇల్లువాకిలి యిచ్చి కాపాడితే నేనేమి చేయగలను? అని పలికెను. ఆమె మరల తన్నుగురించి తలపోసికొనుచు, అవును. ఎన్ని మాట్లాడి యేమి ప్రయోజనము? నేను చేసేదేమో తప్పేగదా. ఈ బ్రతుకులో దిగినప్పటినుండి నెమ్మదియనదేమో నేనెరుగనే ఎరుగను. ఒక తప్పు తరు వాత ఇంకొక తప్పు చేస్తునే యున్నాను. ఒకసారి దొంగతనము చేస్తే ఎప్పటి కిని దొంగయే. అయ్యో! నేనెంత చెడిపోయియున్నానో ఎవరికెరుక! నే నీ విధముగా ఏమో సంతోషము అనుభవించుచున్నానని అందరు అనుకొంటారుగాని నాబ్రతుకును చూడ అది ఎన్ని నదులు పోయిపడినను నిండని సముద్రమువలె నున్నది. ఇప్పుడు నాబ్రతుకును చక్కపరచడానికి ఎవరు పూనుకొంటారు? ఎవరును లేరనుకొంటాను అని పలువిధములుగా చింతించెను.

ఇట్లామె తలపోసికొనుచు దుఃఖముఖముతోనే ఒంటరిగా చేలలో బడి తన యిల్లుచేరెను.

మరునాడామె తాననుకొన్నట్లే మధ్యాహ్నమువేళ ఎఱ్ఱనియెండలో బావికి నీళ్లకు వచ్చుచుండెను. బావి సమీపమునకు వచ్చుసరికి అక్కడ ఎవరో కూర్చుండియున్నట్టు ఆమె చూచి, ఆశ్చర్యపడి, ఈ వేళప్పుడు నేనుతప్ప ఇంకెవరు ఈ బావిదగ్గరకు వస్తారు? అని తలంచెను. ఇంకా కొంచెము సమీపమునకు వచ్చుసరికి అక్కడ కూర్చుండినది ఎవరో ఒక

పురుషుడని గ్రహించెను. ఆయన వస్త్రములను చూచి ఆయన తన జనాంగమునకు సంబంధించినవాడు కాడనియు, ఒక క్రొత్తవాడనియు, ఆమె తెలిసికొనెను. ఆయన చాలా అలసటజెందియుండుటను ఆయన కాళ్లకు చాలా దుమ్ము అంటుకొనియుండుటను చూడగా ఆయన చాలా దూరమునుండి వచ్చెనని తోచకమానదు. ఆయన బహు దయార్ద్రదృష్టితో ఆమెను చూచెను. ఆమె ఏమియు మాట్లాడక తన బిందెను మెల్లగా బావిలోకి దించెను.

అప్పుడా బాటసారి అమ్మా! నాకు దాహానికి కొంచెము నీళ్లిమ్మని అడిగెను. ఇచ్చి పుచ్చుకొనుటలోగాని తిని త్రాగుటలోగాని తమ జనులతో సాంగత్యముచేయని ఈ క్రొత్తవాడు తన్ను నీళ్లడుగుటను చూడగా ఆమెకెంతో ఆశ్చర్యము కలిగెను. అందువల్ల ఆమె అట్లే ఆయనవైపు తేరి చూచుచుండెను.

ఆయన మందహాసముతో, అమ్మా, నీవు దేవుని వరమును నీతో మాట్లాడుచున్నవాడెవడో అదియు నెరిగియుంటే నీ వాయన నడుగుదువు. ఆయన నీకు జీవజలమిచ్చునని చెప్పెను.

ఆమె ఈ మాటలు గ్రహించలేదు. అయితే ఈ బాటసారి ఎవరై యుండవచ్చును? ఆయన ఒక గొప్పవాడుగా కనబడుచుండెను. ఆయన ఇతరులవలె ఆమెను తిరస్కరించి మాట్లాడక బహు మర్యాదగా మాట్లాడెను. అయినను ఆయన ఆమె మనోవ్యాకులమును గ్రహించినట్టుండెను. ఆమె తన బిందెను పైకెత్తి ఆయన దోసిటిలో నీళ్లు పోయగా ఆయన త్రాగెను.

నీళ్లు త్రాగిన తరువాత ఆయన బహు ఆలోచనతో ఆమెవైపు చూచి, ఈ నీళ్లు త్రాగు ప్రతివాడు మరల దప్పిగొనునవెను.

అందుకామె, ఈ మాటలకర్థమేమి? ఈ అల్పసంగతి నాకు తెలియదా యేమి? ఇది అందరికి తెలియునే! అయినను ఆశపుట్టించుచున్న ఈయన మాటల కర్థమేమి? అని తనలో తాను ఆలోచించుకొనుచుండి నంతలో ఆయన, నేనిచ్చు నీళ్లు త్రాగు ప్రతివాడు ఎప్పుడును దప్పిగొనడనెను.

అప్పుడా స్త్రీ ఓహో! ఇవి బహు విచిత్రమైన నీళ్లయి యుండవలెను. ఎప్పుడును దప్పిగొనకుండడము ఎంత మేలు? ఆలాటి నీళ్లు నాకు దొరికిన ఎంత బాగుండును? అని తలచెను.

ఆ బాటసారి ఇప్పుడు కొంచెము విచార ముఖముతో ఆమెవైపు

చూచుచుండెను. ఆయన కొంచెము విచారములో మునిగినట్టే యుండెను. కారణమేమై యుండవచ్చును? ఆమె కొంచెమైనను గ్రహించలేదనియా?

ఆయన ఇక ఏమియు దాచక, అమ్మా, నీవు వెళ్లి నీ పెనిమిటిని ఇక్కడికి పిలుచుకొనిరమ్మని ఆ స్త్రీతో చెప్పెను.

ఆమె సిగ్గుచే తలవంచుకొని, నాకు పెనిమిటి లేదయ్యా అని మెల్లగా చెప్పెను.

ఆ బాటసారి తన ముఖమును ప్రక్కకు త్రిప్పుకొనెను. అకస్మాత్తుగా ఒక శత్రువువచ్చి తన్ను గాయపరచెనేమోయన్నట్లు ఆయన ముఖము కళదప్పెను.

అప్పుడాయన వ్యసనముతో, అమ్మా! నీకు పెనిమిటి లేదని నీవు చెప్పడము నిజమే. అయినను నీకు అయిదుగురు పెనిమిట్లుండిరి. ఇప్పుడు నీకున్నవాడు నీ పెనిమిటికాడు. సత్యమే చెప్పితివనెను.

అది విని ఆ స్త్రీ మిక్కిలి ఆశ్చర్యముతో ఆయనవైపు చూచుచు నిశ్చేష్టితయయ్యెను. ఆమె చరిత్ర యావత్తు ఆయనకు బాగా తెలిసియుండెను. ఆయన ఒక ప్రవక్త యనుటకు ఏ సందేహమును లేదు.

ఆమె చాలా సిగ్గుపడెను. తన బ్రతుకు యావత్తు ఈ బాటసారికి తెలిసియుండెను గనుక ఆయన అందునుగురించి మాట్లాడుట ఆమె కిష్టము లేకుండెను. అది చాలా అయిష్టము పుట్టించే విషయమే. తాను పారిపోయి ఎక్కడనైన దాగుకొంటే బాగుండునని ఆమె అప్పుడు తలంచెను గాని ఆయన దయగల చూపులు ఆమె నట్లు చేయనియ్యలేదు. అదేమి వింతయోగాని ఆయన అక్కడ ఉండడమే ఆమెకేమో మేలు కలిగించినట్టుండెను. ఆయనను విడిచిపెట్టి పోవుటకుగాని ఆయనతో మాట్లాడుటకుగాని ఆమెకు కష్టతరముగా నుండెను. ఆయన ఒక గొప్ప గురువుగా కనబడినందున ఆమె తమ మతాచారములనుగురించి ఆయనను అడుగ తెగించి, అయ్యా! మేమెట్లు ప్రార్థించవలెను? ప్రతివారికి వేరు వేరు క్రమములున్నవే. ఏవి సత్యము? ఏయే పరిశుద్ధస్థలములలో నొకడు దేవుని కనుగొనగలడు? అని ఆయన నడిగెను.

ఆమె ఎట్టి మనస్సుతో ఆ ప్రశ్నలు వేసెనో కనుగొనవలెనన్నట్టు ఆయన ఆమెవైపు నిదానించి చూచెను. ఆయన ఆమె గుట్టు బయటపెట్టినందున ఆ విషయములనుగురించి మాట్లాడుట కిష్టములేక వాటిని కప్పిపెట్టవలెనని ఈ ప్రశ్నలు వేసెనా లేక దేవునిగురించియు ప్రార్థనను గురించియు తెలిసికొనవలెనని మనఃపూర్వకముగా కోరి ఈలాగు అడిగెనా?

ఆయన ఆమె భావమును గ్రహించి ఆమెతో, అమ్మా! దేవాలయములు, పర్వతములు అను విశేషచోట్లలోమాత్రముకాక అంతటను నీవు దేవుని కనుగొనగలవు. అయితే నీ ప్రార్థన ఎప్పుడును మనఃపూర్వకమైనదిగా నుండవలెను. దేవుడు కోరునది అట్టి ప్రార్థనయే. దేవుడు ఆత్మ గనుక ఆయనను ఆరాధించువారు ఆత్మతోను సత్యముతోను ఆరాధించవలెనని ఆయన కోరుచున్నాడనెను.

అయినను ఆమె ఈ మాటలు సరిగా గ్రహించుకొనలేక, సరేనయ్యా! లోకరక్షకుడు వచ్చినప్పుడు ఆయన మాకు ఈ సంగతులన్నియు తెలియజేస్తాడులే అని ఆయనతో చెప్పెను.

అందుకు యేసు, నేనే ఆ లోకరక్షకుని, అని జవాబిచ్చెను.

## ధ్యానము.

యోహాను 4: 5–30 చదువుము.

ఇట్లు ఘోరపాపియై తన యిరుగుపొరుగువారి అభిమానము పోగొట్టుకొనిన ఈ స్త్రీకే లోకరక్షకుడు తన్నుతాను కనుపరచుకొనెను.

మన ఊరిలోకూడ మనము చిన్నగా చూచే కొందరున్నారు. ఊరిలో బహు చెడువాడుకలు ప్రబలియున్నవి. యేసుక్రీస్తు మన ఊరికి వచ్చిన యెడల ఆయనను కలతపరచి నొప్పి పుట్టించే కార్యములు చాలా ఉన్నవి. కేవలము నీతిగా బ్రతికేవారు చాలా అరుదుగా నున్నారుగదా. అయినను మనవంటివారికైనను యేసుక్రీస్తు ఆ జీవజలము ననుగ్రహించ సిద్ధముగా నున్నాడు. బావిదగ్గర తనతో సంభాషించిన ఆ స్త్రీలో యేసుప్రభువు నీతి విషయమైన కోరికను పుట్టించెను. అందువల్ల ఆమెకును పాపముమీది అభిలాష తొలగిపోయెను. ఆమె తన జీవితకాలమంతయు యేసుక్రీస్తును మరువదు. ఆమె ఇతరులను యేసునొద్దకు తెచ్చెను.

## ప్రార్థన.

ప్రభువైన యేసూ! నాకుకూడ నీ దర్శన మనుగ్రహించుము. పాపినైన నేను రక్షకుడవైన నిన్ను చూచునట్లు నాకు సహాయమిమ్మ. పాపేచ్ఛలు కాలిపోయేటట్టు నా హృదయములో మంచికోరికలను మంటమండించుము. నాలో నీతివిషయమైన అభిలాష పుట్టించి పాపము విషయమైన అభిలాష తీసివేయుము. ఆమేన్.

# 6 వ. అధ్యాయము

## కొండమీద

ఇంకను తెల్లవారియుండలేదు. పక్షుల కూతలు వినబడలేదు. పొలములతట్టు ఇంకను మబ్బుగానే యుండెను. అయితే ఆకాశములోని చుక్కలు మాసిపోవుచుండెను. తూర్పుదిశను కొంచెము వెలుగు ఎక్కువయ్యేకొలది పట్టణము సమీపముననున్న కొండమీద ఎవరో తిరుగుచున్నట్టు కనబడెను. ఆయన యేసుక్రీస్తే. ఆయన రాత్రియంతయు దైవ ప్రార్థనలో గడుపుచు ఒంటరిగా ఆ కొండమీద నుండెను. తరువాతి కాలములో తన కార్యమును సఫలపరచి తన్ను వెంబడించి తనకు ప్రియ స్నేహితులుగా నుండుటకు ఆయన కొందరిని ఏర్పరచుకొనవలసి యుండెను. అందుకు తగినవారిని ఏర్పరచుకొనుటలో ఆయనకు దేవుని జ్ఞానమును సహాయమును అవసరమై యుండెను. అదిగాక ఆయన మనుష్యుల అంతర్యములను ఎరుగవలసియుండెను గనుక వానిని సంపాదించుటకు ఆయన దేవునితో సహవాసము చేసెను. ఆయన ఏదైన ఒక యేర్పాటుగాని పనిగాని చేయవలసివచ్చినప్పుడు పలుమారు నిద్రపోగొట్టుకొని ఏకాంతముగా కొండలకువెళ్లి, రాత్రిలో అందునుగూర్చి దేవునితో మాట్లాడువాడు.

ఒకప్పుడు యేసు ఒక గుంపుమధ్య నుండగా అందరు ఆయనను చుట్టుకొని ఆయనతో చాలా ఆశగా మాట్లాడుచుండిరి. వారాయన శిష్యులే గాని మరెవరును కారు. యేసు తమకు నియమించిన పనినుండి వారప్పుడే తిరిగి వచ్చియుండిరి.

వారాయనతో మాట్లాడుచు, స్వామీ! నీవు చెప్పినదంతయు సత్యమే. నీవు చెప్పినట్లు మాకేదియు తక్కువ కాలేదు. నీ పేరెత్తినంత మాత్రముచేత దయ్యములు మాకు లోబడెననిరి.

వారీ సంగతులనుగురించి మరి మరి యుప్పొంగుచు యేసుతో చెప్పుచుండిరి గాని ఆయన తమ మాటలు వినక తనలోతాను ఏమేమో మాట్లాడుకొనుచున్నట్టు వారు గ్రహించిరి. అయితే ఆయన వారితో మాట్లాడక, "భూమ్యాకాశములకు ప్రభువా, నీకు స్తోత్రము" (లూకా

10. 21) అని చెప్పుకొనుచుండెను. వారాయన చెప్పుచుండిన మాటలు విని మిగుల అద్భుతపడిరి. వారు తాము చేసిన పనినిగురించి మాట్లాడుకొనుచు అందునుగురించి చాలా అతిశయించుకొంటూయుండగా యేసుక్రీస్తు, విద్యాబుద్ధులులేని పామరుల కిట్టి అద్భుతములద్వారా ఇతరులకు సహాయము చేయగల శక్తి ననుగ్రహించిన దేవునిగురించి తలంచుచుండెను.

మరియొకసారి ఆయన తన మరణమునకు కొన్నాళ్లు ముందుగా ఇద్దరు ముగ్గురు శిష్యులతోకూడ ఒంటరిగా నుండెను. అది మిగుల భయంకరమైన సమయము. ప్రొద్దు గ్రుంకి రాత్రి అయియుండెను. వారొక తోటలో నుండిరి. చాలా అలసిసొలసియుండినందున శిష్యులు పండుకొనిరి. యేసుస్వామి మాత్రము ఆ చెట్లక్రింద కొంత దూరమువరకు చీకటిలో వెళ్లెను. ఆయన దుఃఖసముద్రములో మునిగియుండెను. ఆయన భయపడుటకును, వ్యసనాక్రాంతుడగుటకును మొదలుపెట్టెను. ఆయన చెమట రక్తబిందువులవలె కారెను. (లూకా 22: 44) ఇక కొంచెముసేపటికి తన్ను మరణము మట్టుకు హింసించు తన శత్రువుల చేతిలో నుండునని ఆయన ఎరిగియుండెను. ఆయన తన తండ్రియెదుట మోకాళ్లూని, తనకు సహాయము చేయుమని ఒకసారి కాకుండ మూడుసార్లు వేడుకొనెను. తన్ను తప్పించి కాపాడుమని కాదుగాని దేవుడు తన నియమములను నెరవేర్చవలెనని ఆయన ప్రార్థించెను. “నా చిత్తము కాదు, నీ చిత్తమే సిద్ధించుగాక” అనెను.

ఈ ప్రార్థనకు జవాబు వచ్చెను. యేసుక్రీస్తుకు శ్రమలును మరణమును సంభవించెను గాని ఆ మరణమువల్ల దేవుని నియమములు నెరవేరి లోక రక్షణ ప్రారంభమాయెను.

## ధ్యానము.

మత్తయి 26 : 37–44 చదువుము

యేసుక్రీస్తు ప్రార్థించిన మాదిరిని నేనుకూడ అనుసరింతును. నేను నా పనులను మొదలుపెట్టకముందు దేవుని సహాయమును ఆశీర్వాదమును వాటితోకూడ నుండునట్లు దేవుని వేడుకొని వాటిని ఆయనపేరట ఆరంభింతును.

ఇతరులతో కలిసిమెలిసి వారి మాటలు వినుచున్నప్పుడు గాని నేను చేసిన పనులనుబట్టి నన్ను నేను పొగడుకొనునట్లు శోధింపబడినప్పుడుగాని నేను దేవుని జ్ఞాపకముచేసికొని ఆయనవైపు నామనస్సును త్రిప్పుకొందును.

నా కేదైన గొప్ప యాపద కలిగినప్పుడు దానిని నాయొద్దనుండి తొలగించవలెననిమాత్రమే కాక తన చిత్తమును నెరవేర్చవలెననికూడ దేవుని ప్రార్థింతును. ఒకవేళ దేవుడు దానిని తొలగించనియెడల నేను యేసుక్రీస్తు శ్రమలను జ్ఞాపకము చేసికొని, ఆయన ఏలాగు వాటి నెదుర్కొని అనుభవించుటవల్ల ఇతరులకు రక్షణ భాగ్యము కలుగునట్లు చేసెనో గమనింతును.

ప్రార్థన.

పరమతండ్రీ! నేను ఒంటరిగా నున్నప్పుడును, ఇతరులతో కలిసి మెలిసి యున్నప్పుడును, దుఃఖములో నున్నప్పుడును యేసుక్రీస్తువలె ప్రార్థించుటకు నాకు నీ కృప దయచేయుము.

నేనీ దినము చేయవలసిన పనులన్నిటిని ఆశీర్వదించుము. నీ ఆశీర్వాదమునకు అయోగ్యమైన పనులు చేయకుండ నన్ను ఆపుము.

నేనును ఇతరులును కలిసి, మా మా సంగతులనుగురించి మాట్లాడుకొనుచు నిన్నుమరచినట్లయిన నిన్నుగురించిన జ్ఞాపకము మాలో పుట్టించుము.

నీచిత్తమైతే నేడు మమ్ములను శోధనలోనుంచియు, అపాయములోనుంచియు, దుఃఖములోనుంచియు తప్పించుము. ఒకవేళ మేమట్లు శ్రమలననుభవించుట నీ చిత్తమైతే యేసుక్రీస్తువలె వాటిని ఓపికతో భరించునట్లు మాకు సహాయము దయచేసి, దాని నాశీర్వాదముగా మార్చుము. ఆమేన్.

# 7 వ. అధ్యాయము

## టోలుగేటునొద్ద

టోలుగేటునొద్ద చాలా బండ్లు ఆగియుండెను. టోలుగేటు కంట్రాక్టరు వసూలైన పైకమును తన లెక్కల పుస్తకములో వ్రాసికొనెను. అతని పుస్తకములు చాలా శుభ్రముగాను అతని లెక్కలు తప్పులుతడకలు లేకుండను ఉండెను. ఎందుకనగా అతడెన్నడును వాటిని అశ్రద్ధ చేయలేదు. అతని పేరు శేవి. బండ్లన్ని సాగిపోయిన తరువాత అతడు తన లెక్కల

పుస్తకమును మరియొకసారి చూచుకొని, నాకు ధన మెక్కువగుచున్నది. నా స్నేహితులకు విందులు చేయించగలను. అయినను అట్లు చేయుటవల్ల నాకేమి ప్రయోజనము? నేను సంపాదించే యీ ధనమువల్ల నా కేమైన సుఖమున్నదా? లేదే. నాకేదో ఒకటి కొరతగానున్నట్టు కనబడుచున్నది. ఆ కొరత నెట్లు తీర్చుకొనగలను? అయ్యో! ఇప్పుడెవరైన వచ్చి నేను బాగా బ్రతుకుకొనుటకు నాకు మంచిమార్గము చూపిన ఎంత బాగుండును! అని యనుకొనెను.

అతడిట్లు చాలా దినములుగా టోలుగేటునొద్ద కూర్చుండి, సుంకము వసూలుచేయుచు, క్రమమైన లెక్కలు వ్రాయుచు నుండెను.

ఇట్లుండగా నొకనాటి ఉదయమున కొంతమంది చిన్నగుంపుగా చేరి రోడ్డుమీద ప్రయాణముచేయుచు టోలుగేటువైపు వచ్చుచుండిరి. తనకు పట్టిపట్టనట్టుగా లేవి వారివైపు చూచుచుండెను. వారు ఇంకను సమీపమునకు వచ్చిరి. ఆ గుంపులోని యొకడు ప్రక్కకు తిరిగి లేవివైపు చూచెను. ఆయన యేసుక్రీస్తే. ఆయన లేవీని చూచి, నన్ను వెంబడించుమని చెప్పెను. తాను ఇన్నాళ్లనుండి ఎదురుచూచుచుండిన ఆ మంచిమార్గమును చూపే వాడు వచ్చెనని లేవి గ్రహించి, తన యుద్యోగమును మంచి వరుమానమును, తన యావదాస్తిని విడిచిపెట్టి ఆయనను వెంబడించెను.

ఇట్లతడు దినదినమును సంవత్సరములపేరట యేసుతో సహవాసము చేసి, ఆయన చెప్పు సంగతులు వినుచు, నేర్చుకొనుచు, ఆయనను ప్రేమించుచు, కనిపెట్టుచు నుండెను. యేసు ఈ లోకమును విడిచినప్పుడు మత్తయియను మారుపేరుగల ఈ లేవి ముసలివాడగుచు, పూర్వము తాను లెక్కలను అనుదిన వ్యాపారములను వ్రాయుచుండిన పద్ధతి ననుసరించి యేసు చెప్పినది, చేసినది, బోధించినది అంతయు వ్రాసిపెట్టవలెనని అనుకొనెను.

అందుకు ఫలితార్థముగా మనకిప్పుడు మత్తయిసువార్తయనే విచిత్రమైన చిన్న పుస్తకము లభించినది.

సరియైన లెక్కలు వ్రాయుటవల్లను, జాగ్రత్తగా గమనించుటవల్లను, క్రమముగా వ్రాయుటవల్లను, లోక ప్రసిద్ధమైన యేసుక్రీస్తు చరిత్రను వ్రాయుటకు తన్ను తాను తగినవానిగా చేసికొన్న ఈ ప్రాచీన టోలుగేటు కంట్రాక్టరుకు మన మెంతయో వందనస్తులమై యుండవలెను గదా.

## ధ్యానము

నేడు నేను చేయబోవు పని యేదైనను సరే, నా చేతనైనంతవరకు నమ్మకముగాను జాగ్రత్తతోను చేయుదును. ఎందుకనగా దానిద్వారా దేవుడు నన్నొకవేళ రాబోయే ఒక తెలియని ఘనకార్యమునకు సిద్ధపరచుచున్నాడేమో.

# 8 వ. అధ్యాయము

## వీధిలో

వీధిలో చాలా అల్లరిగా నుండెను. చాలామంది పురుషులు పెద్ద గుంపుగా చేరి ఒక స్త్రీని లాగుకొని వచ్చుచుండిరి. కొందరు నవ్వుచు ఆమెను ఎగతాళి చేయుచుండిరి. మరికొందరు చాలా కోపముగా మాట్లాడుచుండిరి. దోవను పోయేవారది చూచి, ఏమి యీ యల్లరి? అని యడిగి అందుకు ప్రత్యుత్తరముగా ఏమో గుసగుస మాటలు విని గుంపుతో చేరుకొనిరి. ఆ స్త్రీయైతేనో తన తలవంచుకొని, తన పైట చెరుగు ముసుకు వేసికొని వచ్చుచుండగా దగ్గరనుండినవారు ఆమెను క్రూరముగా పట్టి లాగుచుండిరి. ఆమె వెనుకనుండిన వారామెను నోటికి వచ్చినట్లు తిట్టుచుండిరి.

వారు దేవాలయము దగ్గరకు వచ్చిరి. దాని వెలుపలనుండే విశాలమైన యొక ఆవరణములో యేసు ఒంటరిగా కూర్చుండియుండెను. వారామెను యేసు ముందరికి త్రోసికొనివచ్చి, బిగ్గరగా అరచుచు,

బోధకుడా! ఈమె చాలా చెడ్డది. చెడ్డపని చేస్తుంటే మేము కండ్లార చూచినాము. ఇప్పుడీమెను శిక్షించవలెను. మా చట్టము ప్రకారము ఈమె చావవలెను. ఎట్లా శిక్షించమంటావు? రాళ్లతో కొట్టడమే ఈమెకు తగిన శాస్తి. ఈమె పంచపాతకురాలు గనుక చావే ఈమెకు శాంతి. ఈ లాటివాండ్లవల్లనే మా పట్టణమునకు చెడ్డపేరు వచ్చినదని ఆయనతో చెప్పిరి.

ఆమె చుట్టు క్రిక్కిరిసియుండినవారందరును కోపముతో అరచుచు ఆమెమీద తీవ్రముగా నేరము మోపుచుండిరి. అయితే యేసుమాత్రము

మౌనముగా నుండెను. ఆయన తల యెత్తికూడ చూడలేదు. ఆ స్త్రీ సిగ్గు ముఖముతో ఆయన యెదుట నిలువబడియుండగా వారామెను నిందించుచుండిరి. యేసు వంగి, ఇసుకమీద ఏమో వ్రాయుచుండెను.

వారాయనను చూచి, ఏమయ్యా! ఈమెను ఏమి చేయుమంటావు? అని అడిగిరి.

యేసు తన తల పైకెత్తి వారిని ఎగాదిగ చూచి, మీలో పాపము లేనివాడు మొదట ఆమెమీద రాయి వేయవచ్చునని చెప్పెను.

ఆయన ఆ మాట చెప్పినతోడనే వారి యరుపులు అడుగంటెను. వారందరు ఒకరి తరువాత నొకరు బయటికి దాటుకొనిరి. ఏమీ! పాపము లేనివాడా!! కొందరు వృద్ధులు తాము యౌవనమున చేసిన పాపములు జ్ఞాపకము చేసికొనిరి. తక్కినవారు తాము నిన్నటి వారమే ఒక స్త్రీని మోసగించి ఇప్పుడీమె చేసిన పాపకార్యములోనికి ఏలాగు దింపిరో మతిక తెచ్చుకొనిరి. ఒకడు తాను పచ్చిత్రాగుబోతైనందున ఈమె చేసినదానికంటె తానే అధిక పాపము చేయుచున్నాడు గనుక ఇతరులను తప్పు పట్టజాలనని గ్రహించెను. ఇంకొకడు తాను తన పొరుగువాని భార్య నాశించియుండెనుగాని ఆమె పతివ్రతయై అతనికి లొంగలేదు. ఒకవేళ లొంగియుండినయెడల ఇప్పుడీ స్త్రీ చేసిన పాపమును తానుకూడ చేసియుండునని తలపోసికొనెను. మరియొకడు తానెట్లు తప్ప త్రాగివచ్చి తన భార్యను కొట్టెనో జ్ఞాపకము చేసికొనెను. ఒకడు తానేలాగు ఒక స్త్రీని ఏండ్ల కొలదిగా పెట్టుకొనియుండెనో తలపోసికొనెను. ఇట్లు వారందరు తమ తమ తప్పులు జ్ఞాపకము చేసికొని సిగ్గుపడినవారై, పెద్దవాడు మొదలుకొని చిన్నవానివరకు ఒకనివెంట నొకడు బయటికి జారుకొనిరి. కడకు యేసు క్రీస్తును ఆ స్త్రీయు మాత్రము మిగిలియుండిరి.

యేసు ఆమెను చూచి ఆమెయెడల చాలా జాలినొందినను, నీవు వెళ్లి ఇకను పాపము చేయవలదని ఖండితముగా పలికెను.

## ధ్యానము

మా యూరివారు ఎవరి తప్పునుగురించియైన మాట్లాడుచుండగా నేను వారితో చేరను. మనము ఎవరినిగురించియైనను తీర్పు తీర్చుటకు తగినవారము కామని యేసు చేసిన హెచ్చరికను మరువకుందును. అందరును ఒకరి నొకరు ప్రేమించి, ఒకరి కొకరు సహాయము చేసికొన్నయెడల దొంగ

తనమీద జరుగును? జరుగనేరదు గదా. అందరు తమ శరీరేచ్ఛలను లోపగచుకొన్నయెడల లోకములో ఈ చెడ్డకార్యములు జరుగవు గదా. పైకథలో మనము చూచినట్లు పురుషులు ఆ స్త్రీమీద నేరము మోపి ఆమెను శిక్షించవలెనని కోరిరిగాని ఆమె ఎంత శిక్షకు పాత్రురాలో ఆమెతో పాపముచేసిన పురుషుడుకూడ అంత శిక్షకు పాత్రుడేగదా. మనలో ప్రేమ యుండినయెడల కలహామునకు చోటుండదు. మనమందరము ఆత్మ సంబంధమైన మంచి కార్యములు చేయ నిచ్ఛయించినయెడల త్రాగుడును, వ్యభిచారమును అంతరించును.

నే నితరులయెడల కనుపరచవలసిన నా ధర్మమును నేను పలుమారు తప్పినందున ఎవరినిగాని నిందించను. నాచేతనైనంతమట్టుకు వారికమీదట పాపము చేయకుండునట్లు వారికి సహాయము చేయుదును.

ప్రార్థన.

ప్రభువైన దేవా! నేను మంచి బ్రతుకు బ్రతుకునట్లు నాకు సహాయము చేయుము. శరీరేచ్ఛలనుండి నన్ను విడిపించుము. ఇతరుల నెవరినైనను పాపములో పడద్రోయకుండ నన్ను కాపాడుము. ఎవరైనను నన్ను పాపముచేయ ప్రేరేపించినయెడల దాని నెదిరించుటకు నాకు సహాయము నిమ్ము.

నేనితరుల విషయమై తీర్పు తీర్చకుండునట్లు నాకు సహాయము నిమ్ము. ఇతరులెవరైనా తప్పు చేయుటను నేను చూచియు వారిని మంచి మార్గమునకు త్రిప్ప ప్రయాసపడనందుకు సిగ్గుపడునట్లు నాకు మనస్సు పుట్టించుము.

మా యూరివారందరును నేడు మంచి బ్రతుకు బ్రతుకునట్లు సహాయము చేయుము. ఆమేన్.

# 9 వ. అధ్యాయము

## ఒక విన్నపము

సముద్రపు టొడ్డున నుండిన ఒక పట్టణములో ఒక స్త్రీ తన భర్తతోను ఇద్దరు కుమారులతోను కాపురముండెను. వారి తండ్రి ముసలివాడు.

ఈ కుటుంబమువారు సముద్రములో చేపలుపట్టి జీవనము చేయుచుండిరి. ఒకనాడు ఈ యిద్దరు కుమారులు తమ వలలు ఆరవేసికొనియుండగా యేసు వారున్నచోటికి వచ్చెను. వారు యేసునుగురించి చాలా వినియుండిరి గనుక వారు తమ వృత్తిని విడిచిపెట్టి తన శిష్యులు కండని ఆయన వారిని పిలువగానే వారు ఇష్టపూర్వకముగా ఒప్పుకొనిరి. వారి తల్లిదండ్రులు కొంచెము విచారపడిరి. ఎందుకంటే ఇప్పుడు వారి పనులు చేయుటకు వారి యొద్ద జీతగాండ్లుమాత్రముండిరి. అయితే యేసుక్రీస్తు కీర్తి దేశమంతటను వ్యాపించగా వారు మిగుల సంతోషించిరి.

వారొకరితో నొకరు మాట్లాడుకొనుచు, మన ప్రవక్తలు ప్రవచించిన లోక రక్షకుడీయనే. ఆయన మనకు స్వరాజ్యము తిరిగి తెప్పించి, మన శత్రువులను దేశములోనుండి వెళ్లగొట్టును. అప్పుడు యేసుక్రీస్తు రాజు కాగా ఆయన శిష్యులకు మహా గౌరవము కలుగునని చెప్పుకొనుచుండిరి.

వారి తల్లియైతేనో, యేసుస్వామికి పన్నెండుమంది శిష్యులున్నారు గదా. అయితే ఆయన నా యిద్దరు కుమాళ్లకే ముఖ్య ఉద్యోగములిస్తే ఎంత బాగుండును? నేనిప్పుడే ఆయనయొద్దకు వెళ్లి నా కుమాళ్లకు ఆ ముఖ్య ఉద్యోగములిచ్చునట్లు ముందుగానే మాటతీసికొందునని తలంచెను.

యేసుక్రీస్తు ఒకనాడు అక్కడి సమీప గ్రామములలో సంచరించుచుండగా ఆమె వెళ్లి ఆయన కాళ్లకు మ్రొక్కి, స్వామీ! నా కొక విన్నపమున్నదనెను.

అందుకు యేసు అదేమిటని ఆమె నడిగెను.

ఆమె, ఏమియు లేదుగాని, నీవు నీ రాజ్యమును స్థాపించేటప్పుడు నా యిద్దరు కుమాళ్లకు ముఖ్య ఉద్యోగములనిచ్చి, నీ కుడివైపున ఒకని నీ యెడమవైపున ఒకని కూర్చుండనిమ్మని వేడుకొనెను.

యేసు ఏమియు మాట్లాడక చాలాసేపు ఆమెను నిదానించి చూచి, పిమ్మట, అమ్మా! నీవేమి అడుగుచున్నావో నీకు తెలియదు. నా రాజ్యము ఈ లోక సంబంధమైనది కాదని చెప్పి, నేను పడవలసిన కష్టములు నీ కుమారులు పడగలరా? అని యడిగెను.

అందుకు వారు, అవును, మేము పడగలమనిరి.

యేసు చాలాసేపు ఆలోచించి నిజమే. మీ రెప్పుడో ఒకనాడు ఆలాగు చేయగలరు. అప్పుడు మీరు గ్రహించగలరు. అయితే నా రాజ్యములోని ముఖ్య ఉద్యోగములకు ఎవరు యోగ్యులో వారికే దొరుకును. మీరే

లాగు వాటికి తగినవారు కాగలరో చెప్పెదను వినుడి. ఎవడైనను దేవుని
రాజ్యములో గొప్పవాడు కాగోరినయెడల వాడందరికి పరిచర్య చేయుట
కును తన అల్పస్వల్ప అనుదిన కార్యములవల్ల మేలు చేయుటకును, సహా
యము చేయుటకును, సేవచేయుటకును, నేర్చుకొనవలెననెను.

తక్కిన పదిమంది శిష్యులు వీరిట్లు అడిగిరని తెలిసికొన్నతోడనే
కోపముతో వారిపై మండిపడి, వీరెందుకట్లు అడుగవలెను? వీరెందుకు
మనపైని అధికారులుగా నుండగోరిరి? మనము వారి సరిసమానులము
కామా? అని పలికిరి వారు వాదులాడుచున్నట్లు యేసు చూచి, మీలో
గొప్పవాడై యుండగోరువాడు మీకు పరిచారకుడై యుండవలెను. మీలో
ప్రధానుడై యుండగోరువాడు అందరికిని సేవకుడై యుండవలెనని వారికి
హెచ్చరికగా చెప్పెను. ఒకవేళ ఆయన తన దగ్గరనున్న యాకోబు యోహా
నుల భుజములమీద చేతులుంచి, మనుష్యకుమారుడు సహితము సేవ చేయించు
కొనుటకు రాలేదుగాని సేవచేయుటకే వచ్చెనని పలికియుండవచ్చును.

ప్రార్థన.

పరమతండ్రీ! యేసు చేసిన హెచ్చరికను ఆయన ఇచ్చిన వాగ్దాన
మును గ్రహించి, డబ్బుకాశించి నేను క్రీస్తు సేవ చేయుచుండునట్లు నాకు
సహాయము చేయుము. నా కొరకును నా పిల్లలకొరకును ఈ లోకములోని
గొప్పతనము కోరక నీ రాజ్యములోని ఆ నిశ్చయమైన గొప్పతనమును
మాత్రము కోరునట్లు నాకు సహాయము చేయుము. చెడ్డవాటిని విసర్జించి
మంచివాటిని ఇచ్ఛయించునట్లు నాకు నేర్పుము.

ఇతరులకు గౌరవము కలుగగా చూచి సంతోషించునట్లు నాకు
సహాయము చేయుము. పలుమారు మే మితరులయెడల చూపు అసూయను
క్షమించుము. నాకు రావలసిన గౌరవమును అధికారమును నాకు రాక
పోయినను నేను వాటిని పాటించక వినయమును పరమభాగ్యముగా ఎంచు
కొనునట్లు నాకు సహాయము చేయుము. ఇతరులు నాకు సేవచేయకున్నను
నేనితరులకు సేవచేయు భాగ్యము నాకొరకు వేచియున్నదని నేను మరువ
కుండునట్లు నాకు సహాయము నిమ్ము. నేను నేను నా స్వలాభము కొరక
ఇతరుల మేలు కోరునట్లు కృప దయచేయుము. ఆమేన్.

మత్తయి 20: 20-28 చదువుము.

# 10 వ. అధ్యాయము

## జనుల గుంపులో

వీధి చివరను ఒక చిన్న గుడిసె యుండెను. అందులో నొక స్త్రీ ఒంటరిగా కాపురముండెను. పాపము! ఆమెకొక వ్యాధియుండెను. ఆమె ఎడతెగకుండ ముట్టగుచుండెను గాన జనులామెను చాలా అసహ్యించుకొనిరి. ఆమె కిటువంటి వ్యాధిగలదని ఆమె యిరుగుపొరుగువారికి తెలిసియుండెను గనుక వారామె యింటికి పోవుటలేదు, ఆమెను తమ యిండ్లకు రానిచ్చుట లేదు. ఆమెకు ప్రాణముమీద చాలా విసుకుపుట్టెను. ఆమెకు చాలా ఆస్తి యుండెనుగాని అదియంతయు వైద్యులకిచ్చుటకును మందులు కొనుటకును సరిపోయెను. ఆమె దివారాత్రులు తన్నుగురించి తలపోసికొనుచు, అయ్యో! దేవుడు కన్నుతెరచి నన్ను బాగుచేసినయెడల నెంత బాగుండును! నేను చాలాయేండ్లుగా ఇట్లు కష్టపడుచున్నానే. అందులో నేను ఒంటరదానను. నాకు ఈ వ్యాధియున్నందున అందరు నన్ను అసహ్యించుకొంటారు గనుక ఎవరితోనైన నేస్తముగా నుండుటకును నాకు వీలులేకున్నది. ఓ దేవుడా! మా తండ్రీ! నా వ్యాధి బాగుచెయ్యి స్వామీ! అని ప్రార్థించెను. కొన్ని సార్లు ఆమె యాత్మలో ఏదో యొక వాక్కు ఉండుకొని, ఇప్పుడేలేదు. ఇంకా కొన్నాళ్లు తాళు. నీవు బాగుపడే సమయము వస్తుందని చెప్పినట్లుండెను. అప్పుడామెకు కొంచెము నెమ్మది కలిగెను.

ఒకనాడు ఆ యూరివారు, ఒక గొప్పవైద్యుడు వచ్చి చుట్టుపట్ల గ్రామములలోని రోగులను బాగుచేయుచున్నాడని చెప్పుకొనుచుండగా ఆమె వినెను కొందరు స్త్రీలు ఒకచోట చేరి, ఈ సంగతినిగురించి మాట్లాడుకొనుచుండగా ఆమె వారిప్రక్కను నిలుచుండి, వారిని చూచి, అమ్మా! ఆయన ఎటువంటి రోగులను బాగుచేస్తున్నాడు? అని యడిగెను.

అందుకు వారు, ఒక చెవిటివానిని, కొందరు గుడ్డివారిని, కుంటివారిని, కొందరు కుష్ఠరోగులనుకూడ బాగుచేసినాడట అనిరి.

ఆమె వారు చెప్పిన సమాచారము బహు అక్కరతో వినెనుగాని కొంచెము సందేహించుకొని, సరే, నేను కుంటిదానను కాను, గుడ్డిదానను

కాను, కుష్ఠరోగిని కాను. నా వ్యాధియే వేరుగదా అని తనలో తాను అనుకొని, అమ్మా! ఆయన ఎవరైన ఆడువారిని బాగుచేసినాడా? అని అడిగెను.

అందుకు వారు, అవును. ఆయన ఆడువారినికూడ బాగుచేసినాడట. ఒక బెస్తవాని అత్తకు జ్వరము తగిలి ఒళ్లంతా మండిపోతూయుండగా ఆయన వచ్చి ఆమెమీద తన చేతులుంచినంతలో జ్వరమామెను విడిచెనట. ఆమె బలముగలదై లేచి అప్పుడే వారికి వంట సిద్ధముచేసెనట అనిరి.

అప్పుడా స్త్రీ, ఓహో! జ్వరమునా బాగుచేసినాడు? సరి. నాది జ్వరముకూడ కాదే. నేను ఒకనాడు ఒక యేడు అనకుండ పన్నెండేండ్లనుండి ఈ వ్యాధితో కష్టపడుచున్నానే. అయినను ఈయన ముట్టినంతమాత్రముచేత కుష్ఠరోగులును, ఒక మాట పలికినంతమాత్రముచేత గుడ్డివారును బాగుపడుట బహు వింతగానున్నది. నిజముగా దేవుడాయనకు తోడైయుండవలెను. ఈయన నన్నేల బాగుచేయలేడు? తప్పక బాగుచేస్తాడు. అయినను నేను పోయి అంతమందిలో నా సంగతి ఆయనకెట్లు చెప్పుకొగలను? నాకు సిగ్గుగా నున్నది. అయినా మంచిది. నేనొక పనిచేస్తాను. ఆయన ఈ యూరికి వచ్చినప్పుడు ఆయన గుడ్డలైనా తాకి బాగుపడుతాననుకొనెను.

ఒకనాడు యేసుక్రీస్తు ఆ యూరికి రాగా ఆమె తాననుకొన్నట్లే చేసెను. ఆమె ఆ గుంపులో దూరి, మెల్లగా ఆయన వెనుక నిలుచుండి, ఆయన వస్త్రమును తాకెను. వెంటనే ఆమెకు ప్రాణము తెప్పరిల్లి బలము కలిగినట్లుండెను. తన వ్యాధి కుదిరినట్లు ఆమె గ్రహించెను. అందుకామె తన మనసులో దేవుని స్తుతించుచు గుంపులోనుండి త్వరగా బయటికి దాటుకొనవలెనని ప్రయత్నించెనుగాని ఆమె చాలాదూరము వెళ్లకముందే ఆ గుంపులోని వారు,ఎవరాయనను ముట్టినది? తన్నెవరో ముట్టిరని ఆయన చెప్పుచున్నాడే. అది యెవరు? ఎవరో తన్నుముట్టి బాగుపడినారనియు, ఆ బాగుపడినవారు తన దగ్గరకు రావలెననియు ఆయన కోరుచున్నాడు. అది యెవరు? అని అడుగసాగిరి.

చేయునదేమియులేక ఆ స్త్రీ వణకుచువచ్చి, ఆయనకు మ్రొక్కి నిన్ను ముట్టినది నేనే అని యొప్పుకొనెను. ఇతరులు తన్ను ముట్టుకొననియ్యరని ఆమె యెరిగియుండెను తానాయనను ముట్టినందుకు యేసు తన్ను గద్దించునా? తన కసహ్యకరమైన వ్యాధియుండగా తాను యేసునొద్దకు వెళ్లి ఆయనను ముట్టినందుకు ఆమె మరెక్కువగా భయపడునుగదా. అవును. ఆమె వణకుచు ఆయనవైపు చూచెను.

అయితే ఆమె అనుకొన్నట్టు యేసు ఎంతమాత్రమును కోపము చూపక మిక్కిలి దయాదాక్షిణ్యపూర్ణుడై, అమ్మా! ధైర్యముగా ఉండుము. నీ నమ్మకమే నిన్ను బాగుచేసినది. చల్లగా పో అమ్మా అని బహు దీనముగా పలికెను.

## ధ్యానము.

లూకా 8 : 4౽-48. చదువుము

నా అంతరంగ బ్రతుకును తొందరపెట్టునది యేదైననుసరే, దానిని యేసుకు ఎరిగింతును. నేను దేనినిగురించి నాలో నేను సిగ్గుపడుచున్నానో దానినిగురించియే యేసుతో మాట్లాడుదును. నా బ్రతుకును భంగపరచెడి ఏ పాపరోగము నాలో నున్నను యేసు దాని బాగుచేసి, నన్ను బలపరచ గలడని నమ్ముచున్నాను. ఇతరులతో సహవాసము చేయకుండ నన్నడ్డగించు నా హృదయములోని ఏ కల్మషమునుగాని నా బ్రతుకులోని ఏ చెడ్డ అలవాటునుగాని తీసివేసి నన్ను శుద్ధునిగా చేయుమని నేనా పరమవైద్యుని వేడు కొందును. ఆమేన్.

# 11 వ. అధ్యాయము

## కలహము

ఒకానొక గ్రామములో నొక కుటుంబమువారి తండ్రి చనిపోయెను. అతడు చనిపోయినప్పటినుండి ఆ యింటివారికి నెమ్మదిలేకుండెను. తండ్రి సంపాదించిన కొన్ని ఎకరముల భూమిమాత్రము అతని యిద్దరు కుమారుల స్వాధీనమాయెను. పెద్దవాడు కొంచెము శాంతిపరుడు. కుష్కినేలలో పండిన పంటలతో వాడు తృప్తిజెందియుండెను. వారికి మాగాణిగాని నల్ల రేగడి భూమిగాని లేదు. వారి భూములన్నియు ఎర్రనేల గనుక వారు కష్టసాధ్యముగా పంటలు పండించుచుండిరి.

చిన్నవాడట్లుకాక నెమ్మదిలేనివాడును కొంచెము సోమరియునై యుండెను. ఇట్లుండియు వాడు గొంతెమ్మ కోరికలు కోరేవాడు. మంచి నీటి వసతిగలిగి బాగా పైరు పండుచుండిన తన ఇరుగుపొరుగువారి భూములు తనకు కావలెనని అతడు మిగుల నాశించెను.

అతడు తన అన్నను చూచి, అన్నా! మనము బయనా పైకము అప్పుతీసి కొని ఒకబావి త్రవ్వించుదమనెను. అంతట వారికి క్రింది సంభాషణ జరిగెను.

అన్న.—మనది మెట్ట భూమి గనుక నీళ్లు దొరికేది కష్టము.

తమ్ముడు.—బావి త్రవ్వించినట్లయితే వరి పండుటకు నీళ్లు చాలకపోయినను రాగులు, జొన్నలు పండించవచ్చునుగదా. వీటివల్ల కొర్రలు, ఉలవలు, మొదలగువాటికంటె ఎక్కువ లాభము వస్తుంది. ఏదో ఒక విధముగా మనము మన బీదస్థితినుండి గడ్డెక్కవలెనుగదా. మన యూరివారు మనము బీదవారమైనందున మనల నెట్లు చిన్న చూపు చూచుచున్నారో చూడు.

అన్న.—ఒకవేళ మనము బావి త్రవ్వించినను కపిల తోలుటకు ఎద్దులేవి?

తమ్ముడు.—ఎద్దులను కొనుటకు మనము ఇంకొకచోట అప్పుతీసికొందము. మన ఆసామి మన కవసరమైన పైకము అప్పు ఇస్తాడు. వచ్చిన లాభములో మనమా అప్పు తీర్చుదము. లాభములు సంపాదించుట మేలుకాదా? అన్నా! నేను ధనికుని కావలెనని చాలా ఆశయున్నది. అప్పుడు మనము మరెక్కువ భూములు కొనవచ్చునుగదా.

అన్న.—మనమెంత లోతు త్రవ్వితే నీళ్లు పడునో నీ కెట్లా తెలియును? ఇంతకు ముందొకసారి అడిగి కనుగొనగా సువారు ఎనభై లేక నూరడుగులు త్రవ్వినను అప్పటికికూడ నీళ్లుపడేది సందేహమని చెప్పినారు. ఇది నష్టము తెచ్చిపెట్టే పనియే. ఒకవేళ మనము అప్పు తీసికొన్నతర్వాత మన పని భంగమైతే మనము అప్పులో మునిగిపోవలసినదేగదా. అసలుమొత్తము అట్లుండనిచ్చి వడ్డి తీర్చే విధమేదో నాకు చూపు? అప్పిచ్చిన ఆసామి మన భూములను అప్పులోకి తీసికొంటాడు. గనుక తమ్ముడా! మనకున్న దానితో తృప్తిపడుదము లెమ్ము. మనము కష్టపడి పనిచేస్తే మనకిప్పుడున్నట్టే జరుపుకొనుటకు తగినంత మనకున్నది. ఇప్పటికి మనకేలాటి అప్పులు లేవుగదా.

తమ్ముడు.—అది చాలదు. నాకు ఇంకా ఎక్కువ డబ్బు కావలెను. ఒకవేళ మన యదృష్టము సరిగా ఉంటే పైననే నీళ్లుపడవచ్చును. వర్షములు బాగా కురిసి బావినిండ ఎప్పుడును నీళ్లుండుటవలన మనము లాభము సంపాదించవచ్చును గనుక అప్పుతీసి తీరవలెను.

